# అథ త్రయోవింశో%ధ్యాయః

## సన్న్యాసికి పన్నెండవనాడు చేయదగిన కృత్యము

శ్రీసుబ్రహ్మణ్య ఉవాచ |

ద్వాదశాహే సముత్థాయ ప్రాతస్స్నాత్వా కృతాహ్నికః | శివభక్తాన్ యతీన్ వాపి బ్రహ్మణాన్ వా శివప్రియాన్ || 1

నిమంత్ర్య తాన్ సమాహూయ మధ్యాహ్నే చాప్లుతాన్ శుచీన్ | విధివద్పూజయేద్భక్త్యా స్వాద్వన్నైర్వివిధైశ్శుభైః || 2

సన్నిధౌ పరమేశస్య పంచావరణమార్గతః | పూజయేత్తత్ర సంస్థాప్య ప్రాణానాయమ్య వాగ్యతః || 3

మహాసంకల్పమార్గేణ సంకల్ప్యాస్మద్గురోరిహ | పూజాం కరిష్య ఇత్యుక్త్వా తతో దర్భానుపస్పృశేత్ || 4

పాదౌ ప్రక్షాల్య చాచమ్య స్వయం కర్తా చ వాగ్యతః | స్థాపయేదాసనే తాన్ వై ప్రాఙ్ముఖాన్ భస్మభూషితాన్ || 5

సదాశివాదిక్రమతో ధ్యాయేదష్టౌ చ తత్ర తాన్ | పరయా సంభావనయేతరానపి మునే ద్విజాన్ || 6

పరమేష్ఠి గురుం ధ్యాయేత్సాంబబుద్ధ్యా స్వనామతః | గురం చ పరమం తస్మాత్పరాత్పరగురుం తతః || 7

ఇదమాసనమిత్యుక్త్వా చసనాని ప్రకల్పయేత్ | ప్రణవాది ద్వితీయాంతే స్వస్య నామ సముచ్చరన్ || 8

ఆవాహయామి నమ ఇత్యావాహ్యోర్ఘోదకేన తు | పాద్యమాచమనం చార్ఘ్యం వస్త్ర గంధాక్షతానపి || 9

దత్త్వా పుష్పై#ఁరలంకృత్య ప్రణవాద్యష్టనామభిః |
సచతుర్థీనమో%ంతైశ్చ సుగంధకుసుమైస్తతః || 10

ధూపదీపౌ హి దత్త్వా చ సకలారాధనం కృతమ్ | సంపూర్ణమస్త్వితి ప్రోచ్య నమస్కుర్యాత్సముత్థితః || 11

శ్రీసుబ్రహ్మణ్యస్వామి ఇట్లు చెప్పెను -

సన్న్యాసి మరణించిననాటినుండి పన్నెండవ రోజున విధిని నిర్వహించే కర్త ఉదయమే నిద్రలేచి, స్నానమును చేసి, నిత్యకర్మలను చేసుకొని, శివభక్తులగు యతులను గాని, లేదా శివునకు ప్రియులగు బ్రాహ్మణులను గాని (1), పూర్వమే నిమంత్రింపబడియున్నవారిని ఆహ్వానించి, వారు స్నానము చేసిన తరువాత మధ్యాహ్నమునందు వారికి భక్తితో వివిధములగు శుభకరములైన ఆహారపదార్థములను యథావిధిగా వడ్డించి, వారిచే భుజింపజేయ వలెను (2). వారిని పరమేశ్వరసన్నిధిలో అచట కూర్చుండబెట్టి పంచావరణవిధానములో పూజించవలెను. ప్రాణాయామమును చేసి , వాఙ్నియమము గలవాడై (3), మహాసంకల్పమును చెప్పి, అస్మద్గురోరిహ పూజాం కరిష్యే (ఇచట మా గురువును పూజించెదను) అని సంకల్పించి, తరువాత దర్భలను స్పృశించవలెను (4). వారి కాళ్లను కడిగి, తాను స్వయముగా ఆచమనమును చేసి, వాఙ్నియమము గలవాడై, భస్మను అలంకరించుకొనియున్న ఆ బ్రాహ్మణులను ఆసనములయందు తూర్పు ముఖముగా కూర్చుండబెట్టవలెను (5). ఓ మునీ! సదాశివునితో మొదలిడి వరుసగా ఎనిమిది నామములను ధ్యానించవలెను. ఆ బ్రాహ్మణులను మరియు అచట ఉన్న ఇతరులను కూడ గొప్పగా మర్యాద చేయవలెను (6). గురువు, పరమగురువు, పరాత్పర గురువు, పరమేష్ఠి గురువు అను నాల్గు గురువులు గలరు. కర్తత న పేరును ఉచ్చరించి, తన గురువును సాంబమూర్తి అనే భావనతో ధ్యానించవలెను. తరువాత తన గురువు యొక్క గురువును, మరియు పరాత్పరగురువు

(సంప్రదాయప్రవర్తకుడగు ఆచార్యుడు) నుధ్యానించవలెను (7). ఇదమాసనమ్ (ఇది ఆసనము) అని పలికి, ఓంకారమును మరియు ద్వితీయావిభక్తితో తన పేరును ఉచ్చరించి , ఆసనములను ఈయవలెను (8). ఆవాహయామి నమః (నేను ఆవాహన చేయుచున్నాను, నమస్కారమగుగాక!) అని పలికి, పవిత్రమగు ఉదకముతో పాద్యమును, అర్ఘ్యమును మరియు ఆచమనీయమును సమర్పించి, వస్త్రమును, గంధమును మరియు అక్షతలను కూడ (9) సమర్పించి, పుష్పములతో అలంకరించి, ఓంకారముతో మొదలిడి ఎనిమిది నామములను చతుర్థీ విభక్తితో చెప్పినమః (నమస్కారమగుగాక!) తో పూర్తి చేసి, తరువాత పరిమళభరితములగు పూవులతో పూజించవలెను (10). ధూపదీపములను సమర్పించి, సకలారాధనం కృతమ్ , సంపూర్ణమస్తు (సకలములగు ఆరాధనలను చేసితిని, ఈ కర్మ పరిపూర్ణమగు గాక!) అని పలికి, లేచి నిలబడి నమస్కరించవలెను (11).

పాత్రాణి కదలీపత్రాణ్యాస్తీర్యాద్భిర్విశోధ్య చ |
శుద్ధాన్నపాయసాపూపసూపవ్యంజనపూర్వకమ్ || 12

దత్త్వా పదార్థాన్ కదలీనాలికేరగుడాన్వితాన్ | పాత్రాసనాని చ
పృథగ్దద్యాత్స్వం ప్రోచ్య చ క్రమాత్ || 13

పరిషిచ్య చ సంప్రోక్ష్య విష్ణో హవ్యమితి బ్రువన్ | రక్షస్వేతి
కరస్పర్శం కారయిత్వా సముత్థితః || 14

ఆపోశనం సమర్ప్యాథ ప్రార్థయేత్తా నిదం ప్రతి | సదాశివాదయః ప్రీతా
వరదాశ్చ భవంతుమే || 15

యే దేవా ఇతి చ తతో జప్త్వేదం సాక్షతం త్యజేత్ | నమస్కృత్య
సముత్థాయ సర్వత్రామృతమస్త్వితి || 16

ఉక్త్వా ప్రసాద్య చ జపన్ గణానాం త్వేత్యుపక్రమాత్ | వేదాదీన్
రుద్రచమకౌ రుద్రసూక్తం చ పంచ చ || 17

విప్రాణాం భోజనాంతే తు యావన్మంత్రాంశ్చ సాక్షతాన్ |
దత్త్వోత్తరాపోశనంచ హస్తాంఘ్రిముఖశోధనమ్ || 18

కృత్వా%%చాంతాన్ స్వాసనేషు స్థాపయిత్వా యథాసుఖమ్ |
శుద్ధోదకం ప్రదాయాథ కర్పూరాది యథోదితమ్ || 19

ముఖవాసం దక్షిణాం చ పాదుకాసనపత్రకమ్ | వ్యజనం ఫలకాన్
దండం వైణవం చ ప్రదాయ తాన్ || 20

ప్రదక్షిణనమస్కారైస్సంతోష్యాశిషమావహేత్ | పునః ప్రణమ్య
సంప్రార్థ్య గురుభక్తిమచంచలామ్ || 21

అరటి ఆకులను భోజనపాత్రలుగా వాడవలెను. వాటిని నీటితో కడిగి, పరిశుభ్రమగు అన్నమును, పాయసమును, అప్పములను, పులుసును, పచ్చడిని (12) , అరటి పళ్లను కొబ్బరి ముక్కలను మరియు బెల్లమును వడ్డించవలెను. ఈ అరటి ఆకుల క్రింద వేర్వేరుగా దర్భలను వేయవలెను. వాటి చుట్టూ పరిషేచనమును చేసి (నీటిని చుట్టూ సన్నని ధారగా పోసి), విష్ణో హవ్యం రక్షస్వ (ఓ విష్ణూ! ఆహుతిద్రవ్యమును రక్షించుము) అని పలికి వరుసలో నీటితో సంప్రోక్షించవలెను. వాటిని ఆ బ్రాహ్మణులు తమ మధ్యవ్రేలితో స్పృశించిన తరువాత కర్త లేచి నిలబడవలెను (13, 14). తరువాత వారి చేతులలో ఉదకమును వేసి, వారిని ఇట్లు ప్రార్థించవలెను: సదాశివుడు మొదలగు దేవతలు నాయందు ప్రీతి గలవారై నాకు వరములనిచ్చెదరు గాక! (15) తరువాత యే దేవాః --- అని మొదలయ్యే మంత్రమును జపించి, నమస్కరించి లేచి నిలబడి సర్వత్రామృతమస్తు (అంతటా అమృతమగు గాక!) అని పలికి అక్షతలను విడిచిపెట్టవలెను. వారిని ఈ విధముగా ప్రసన్నులను చేసి, గణానాం త్వా (గణములకు ప్రభువగు నిన్ను) అను మంత్రముతో ఆరంభించి, నాలుగు వేదముల మొదటి మంత్రములను, నమకచమకములను, రుద్రసూక్తమును, పంచబ్రహ్మమంత్రములను జపించవలెను (16, 17). ఈ మంత్రములను జపించునంతలో ఆ బ్రాహ్మణుల భోజనము పూర్తి

యగును. వారికి అక్షతలతో పాటు ఉత్తరాపోశనమునిచ్చి (భోజనము అయిన తరువాత నీటిని ఇచ్చుట), వారికి చేతులను ముఖమును కాళ్లను కడుగుకొనుటకు నీటిని ఏర్పాటు చేసి, వారు ఆచమనము చేసిన తరువాత వారి వారి ఆసనములయందు సుఖముగా కూర్చుండబెట్టి, శుభ్రమగు నీటిని ఇచ్చి, తరువాత కర్పూరము మొదలగు వాటిని, తాంబూలమును మరియు దక్షిణను ఇంతకు ముందు చెప్పిన విధముగా ఈయవలెను. వారికి చెప్పులను, ఆసనమును, తమలపాకులను, విసెనకర్రను, బల్లలను, వెదురు కర్రను కూడ ఈయవలెను (18-20). వారికి ప్రదక్షిణము చేసి నమస్కారముతో వారిని సంతోషపెట్టి, ఆశీస్సులను స్వీకరించవలెను. మరల వారికి నమస్కరించి చలనము లేని గురుభక్తిని అనుగ్రహించుడని ప్రార్థించవలెను (21).

సదాశివాదయః ప్రీతా గచ్ఛంతు చ యథాసుఖమ్ | ఇత్యుద్వాస్య ద్వారదేశావధి సమ్యగనువ్రజన్ || 22

నిరుద్ధసై#్రః పరావృత్య ద్వాఃస్థైర్విపై#్ర శ్చ బంధుభిః | దీనానాథైశ్చ సహితో భుక్త్వా తిష్ఠేద్యథాసుఖమ్ || 23

వికృతం న భ##వేత్క్వాపి సత్యం సత్యం పునః పునః | ప్రత్యబ్దమేవం కుర్వాణో గుర్వారాధనముత్తమమ్ ||

ఇహ భుక్త్వా మహాభోగాన్ శివలోకమవాప్నుయాత్ || 24

సదాశివుడు మొదలగు దేవతలు ప్రీతిని పొందినవారై సుఖముగా వెళ్లెదరు గాక! అని ఉద్వాసనను చెప్పి, ఆ బ్రాహ్మణులను అనుసరిస్తూ ద్వారము వరకు వెళ్లవలెను (22). ద్వారము వద్ద తిరిగి వెళ్లుడని వారు చెప్పిన తరువాత వెనుకకు మరలి వచ్చి, బ్రాహ్మణులతో, బంధువులతో, దీనులతో మరియు అనాథులతో కలిసి భోజనమును చేసి సుఖముగా నుండవలెను (23). ఈ ప్రక్రియలో ఎక్కడైననూ లోపము జరుగరాదు. ఇది ముమ్మాటికీ యథార్థము. ప్రతి

సంవత్సరము ఈ విధముగా గురువుయొక్క ఉత్తమమగు ఆరాధనను చేయు వ్యక్తి ఇహలోకములో గొప్ప భోగములననుభవించి, శివలోకమును పొందును (24).

సూత ఉవాచ |

ఏవం కృతానుగ్రహమాత్మశిష్యం శ్రీవామదేవం మునివర్యముక్త్వా |

ప్రసన్నధీః జ్ఞానివరో మహాత్మా కృత్వా పరానుగ్రహమాశు దేవః || 25

యన్నైమిషారణ్యమునీశ్వరాణాం ప్రోక్తం పురా వ్యాసమునీశ్వరేణ |

తస్మాదసావాదిగురుర్భవాంస్తు ద్వితీయ ఆర్యో భువనే ప్రసిద్ధః || 26

శ్రుత్వా మునీంద్రో భవతో ముఖాబ్జాత్సనత్కుమారశ్శివభక్తిపూర్ణః ||

వ్యాసాయ వక్తా స చ శైవవర్యశ్శుకాయ వక్తా భవితా చ పూర్ణః || 27

ప్రత్యేకం మునిశార్దూలం శిష్యవర్గచతుష్టయమ్ |
వేదాధ్యయనసంవృత్తం ధర్మస్థాపనపూర్వకమ్ || 28

వైశంపాయన ఏవ స్యాత్త్పైలో జైమినిరేవ చ | సుమంతుశ్చేతి చత్వారో వ్యాసశిష్యా మహౌజసః || 29

అగస్త్యశ్చ పులస్త్య శ్చ పులహః క్రతురేవ చ | తవ శిష్యా మహాత్మానో వామదేవ మహామునే || 30

సనకశ్చ సనందశ్చ సనాతనమునిస్తతః | సనత్సుజాత ఇత్యేతే యోగివర్యాశ్శివప్రియాః || 31

సనత్కుమారశిష్యాస్తే సర్వవేదార్థవిత్తమాః | గురుశ్చ పరమశ్చైవ పరాత్పరగురుస్తతః |

పరమేష్ఠిగురుశ్చైతే పూజ్యాస్స్యుశ్శుకయోగినః || 32

ఇదం ప్రణవవిజ్ఞానం స్థితం వర్గచతుష్టయే | సర్వోత్కృష్టనిదానం చ కాశ్యాం సన్ముక్తికారణమ్ || 33

ఏతన్మండలమద్భుతం పరశివాధిష్ఠానరూపం సదా వేదాంతార్థవిచారపూర్ణమతిభిః పూజ్యం యతీంద్రైః పరమ్ |

వేదాదిప్రవిభాగకల్పితమహాకాశాదినాప్యావృతం త్వత్సంతోషకరం తథాస్తు జగతాం శ్రేయస్కరం శ్రీప్రదమ్ || 34

మత్తః శ్రుతం యద్భవతా తతో మునే భవన్మతం ప్రాజ్ఞతమా వదంతి || 35

సూతుడు ఇట్లు పలికెను -

ప్రసన్నమగు మనస్సు గలవాడు, జ్ఞానులలో శ్రేష్ఠుడు, మహాత్ముడు అగు స్కందదేవుడు ఈ విధముగా అనుగ్రహించి తన శిష్యునిగా చేసుకొనియున్న వామదేవమహర్షితో ఇట్లు పలికి, సర్వోత్కృష్టమగు అనుగ్రహమును చూపుతూ వెంటనే ఇట్లు పలికెను (25). పూర్వము వ్యాసమహర్షి ఈ జ్ఞానమును నైమిషారణ్యమునందలి మహర్షులకు చెప్పియుండెను. కావుననే, ఆయన జగత్తునకు మొదటి గురువు. పూజ్యుడవగు నీవు లోకములో రెండవ గురువుగా ప్రసిద్ధిని పొందగలవు (26). నీ ముఖపద్మమునుండి దీనిని విని శివభక్తితో నిండిన సనత్కుమారమహర్షి వ్యాసునకు చెప్పగలడు. ఆ శివభక్తాగ్రగణ్యుడు శుకునకు బోధించి పూర్ణుడు కాగలడు (27). వ్యాసుడు నలుగురు మహర్షులను తన శిష్యులుగా చేసుకొని వారికి ఒక్కొక్క వేదమును బోధించి వారి ద్వారా లోకములో ధర్మమును స్థాపించును (28). వైశంపాయనుడు, పైలుడు, జైమిని, సుమంతుడు అను మహాతేజశ్శాలురగు నలుగురు వ్యాసుని శిష్యులు (29). ఓ వామదేవమహర్షీ! అగస్త్యుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు అను మహాత్ములు నీకు శిష్యులు (30). యోగిశ్రేష్ఠుడు, శివునకు ప్రియమైనవారు, వేదముల సారమునంతనూ తెలిసినవారిలో ఉత్తములు అగు సనక, సనందన, సనాతన, సనత్సుజాతులనే

మహర్షులు సనత్కుమారుని శిష్యులు, ఈ విధముగా శుకయోగియొక్క గురువు (వ్యాసుడు), పరమగురువు (సనత్కుమారుడు), పరమేష్ఠిగురువు (వామదేవమహర్షి) మరియు పరాత్పరగురువు (కుమారస్వామి) అనువారు పూజింపదగినవారు (31, 32). కాశీయందు సద్రూపమగు ముక్తికి కారణమైనది, సమస్తవిధముల ఔన్నత్యమునకు హేతువు అయినది ఆగు ఈ ఓంకారవిజ్ఞానము నాలుగు పురుషార్థముల యందు ఉన్నది (వాటికి హేతువు అగును) (33). అద్భుతమైనది, సర్వకాలములలో ఆ పరమశివునకు నివాసస్థానము అయినది, ఉపనిషత్తుల తాత్పర్యమును విచారించుటచే పూర్ణమైన మనస్సు గల యతిశ్రేష్ఠులచే విశేషముగా ఆరాధింపబడునది, వేదకర్తయగు పరమేశ్వరునిలో భాగమైన మాయాశక్తియందు కల్పించబడిన ఆకాశము మొదలగు పంచమహాభూతములచే చుట్టు వారబడియున్నది అగు ఈ మండలము నీకు సంతోషమును, జగత్తులకు శ్రేయస్సును కలిగించి, సంపదలనిచ్చును (34). ఓ మునీ! పరమరహస్యము, శివునిచే చెప్పబడినది, ఉపనిషత్సిద్ధాంతమునందు నిశ్చయించబడి యున్నది అగు ఈ జ్ఞానమును నీవు నానుండి వినియుంటివి. కావున, గొప్ప బుద్ధిమంతులు దీనిని నీ మతమని వర్ణించెదరు (35).

తస్మాదనేనైవ పథా గతశ్శివం శివ్యోహమస్మీతి శివో భ##వేద్యతిః |

పితామహాదిప్రవిభాగముక్తయే నద్యో యథా సింధుమిమాః ప్రయాంతి || 36

ఏవం మునీశ్వరాయైతదుపదిశ్య సురేశ్వరః | సంస్మృత్య చరణాంభోజే పిత్రోస్సర్వసురార్చితే || 37

కైలాసశిఖరం ప్రాప కుమారశ్శిఖరావృతమ్ | రాజితం పరమాశ్చర్యం దివ్యజ్ఞానప్రదో గురుః || 38

వామదేవో%పి సచ్ఛిష్యై#ృస్సంవృతశ్శిఖివాహనమ్ | సంప్రణమ్య జగామాశు కైలాసం పరమాద్భుతమ్ || 39

గత్వా కైలాసశిఖరం ప్రాప్యేశనికటం మునిః | దదర్శ మోక్షదం మాయానాశం చరణమీశయోః || 40

భక్త్యా చార్పితసర్వాంగో విస్మృత్య స్వం కలేవరమ్ | పపాత సన్నిధౌ భూయో భూయో నత్వా సముత్థితః || 41

తతో బహువిధైః స్తోత్రై ర్వేదాగమరసోత్కటైః | తుష్టావ పరమేశానం సాంబికం ససుతం మునిః || 42

నిధాయ చరణాంభోజం దేవదేవ్యోస్స్వమూర్ధని | పూర్ణానుగ్రహమాసాద్య తత్రైవ న్యవసత్సుఖమ్ || 43

భవంతో%పి విదిత్వైవం ప్రణవార్థం మహేశ్వరమ్ | వేదగుహ్యం చ సర్వస్వం తారకం బ్రహ్మ ముక్తిదమ్ || 44

అత్రైవ సుఖమాసీనాః శ్రీవిశ్వేశ్వరపాదయోః | సాయుజ్యరూపామతులాం భజధ్వం ముక్తిముత్తమామ్ || 45

అహం గురుపదాంభోజసేవాయై బాదరాశ్రమమ్ | గమిష్యే భవతాం భూయస్సత్సంభాషణమస్తు మే || 46

ఇతి శ్రీశివమహాపురాణ కైలాససంహితాయాం ద్వాదశాహకృత్యవర్ణనం నామ త్రయోవింశో%ధ్యాయః (23).

|| సమాప్తేయం షష్ఠీ కైలాససంహితా ||

కావున, యతి ఇదే మార్గములో పయనించి, శివో%హమస్మి (నేను శివుడనే అగుచున్నాను) అని ధ్యానించి, నదులు సముద్రమును చేరు విధముగా శివుని చేరుకొని శివుడు అగును. బ్రహ్మతో మొదలయ్యే ఈ ద్వైతప్రపంచమునుండి ఆతడు ముక్తిని పొందును (36). దేవతలకు ప్రభువు, దివ్యజ్ఞానమునిచ్చే గురువు అగు కుమారస్వామి ఈ విధముగా వామదేవమహర్షికి ఈ జ్ఞానమును ఉపదేశించి, సకలదేవతలచే ఆరాధించబడే తన తల్లిదండ్రుల పాదపద్మలను స్మరించి, వెండి శిఖరములతో కూడి

పరమాశ్చర్యమును కలిగించు కైలాసపర్వతముయొక్క శిఖరమును చేరెను (37, 38). వామదేవుడు కూడ మంచి శిష్యులతో కూడినవాడై, మయూరవాహనుడగు కుమారస్వామికి చక్కగా ప్రణమిల్లి, వెంటనే పరమాశ్చర్యకరమగు కైలాసమునకు వెళ్లెను (39). ఆ ముని కైలాసశిఖరమునకు వెళ్లి, ఈశ్వరుని సమీపమును చేరి, మాయను నశింపజేసి మోక్షమునిచ్చే పార్వతీపరమేశ్వరుల పాదములను దర్శించెను (40). ఆయన భక్తితో నిండిపోయిన సకలావయవములు గలవాడై, తన దేహమును మరచి, శివుని సన్నిధిలో పలుమార్లు సాష్టాంగముగా ప్రణమిల్లి లేచి నిలబడెను (41). తరువాత ఆ ముని జగన్మాతతో మరియు పుత్రులతో కూడియున్న పరమేశ్వరుని అనేకరకములైన వేదశాస్త్రముల సారముతో నిండి గంభీరముగా నున్న స్తోత్రములతో స్తుతించెను (42). ఆయన పార్వతీపరమేశ్వరుల పాదపద్మములను తన శిరస్సుపై దాల్చి, పూర్ణమగు అనుగ్రహమును సంపాదించి అచటనే సుఖముగా నివసించెను (43). మీరు కూడ ఇదే విధముగా ఓంకారముయొక్క అర్థము, వేదముల రహస్యము, సర్వస్వరూపము, సంసారతారకము, పరంబ్రహ్మము అగు మహేశ్వరతత్త్వమును తెలుసుకొనుడు (44). మీరు ఒక్కడనే సుఖముగా నున్నవారై, శ్రీవిశ్వేశ్వరుని పాదపద్మముల సాయుజ్యము అనే రూపములో నున్న సాటిలేని ఉత్తమమగు ముక్తిని సేవించుడు (45). నేను గురువుయొక్క పాదపద్మములను సేవించుటకై బదరికాశ్రమమునకు వెళ్లెదను. నాకు మరల మీతో మంచి సంభాషణము కలుగుగాక! (46)

శ్రీశివమహాపురాణములోని కైలాససంహితయందు సన్న్యాసికి పన్నెండవ రోజు చేయుదగిన కృత్యములను వర్ణించే ఇరువది మూడవ అధ్యాయము ముగిసినది (23).

శ్రీ శివమహాపురాణములో ఆరవదియగు కైలాససంహిత ముగిసినది

|| శ్రీకృష్ణార్పణమస్తు ||

|| శ్రీ సాంబ సదాశివార్పణమస్తు ||